# శతపత్రము



కవిపాదుషా

పువ్వాడ శేషగిరిరావు

మూల్యము:- ఇరువది రూపాయలు

విజయదశమి 1997

వేయి ప్రతులు

ప్రతులకు:-

**పువ్వాడ పద్మావతి**

2-8, చైతన్యపురి,

హైదరాబాదు - 500 060

ఈ గ్రంథముద్రణకు ఆర్థిక సహాయమున కంగీకరించిన

తిరుమల తిరుపతి దేవస్థానము వారికి **కృతజ్ఞతాంజలి**

ముద్రణ:

**విష్ణ ప్రింటర్స్ (ప్రై) లిమిటెడ్**

నల్లకుంట, హైదరాబాదు-44.

ఫోన్: 7636242

## 'కవిపాదుషా' గురించి . . . .

"ప్రసిద్ధులయిన నవ్య కవులలో శ్రీ పువ్వాడ శేషగిరిరావు గారొకరు. పలుకులు మెత్తనివైనా పలుకుబడి మహాతీవ్రమైనది. పద్య రచనలో మంచి పనివాడు. ఆయన కావ్య పఠనం చేస్తుంటే కవి, గాయకుడు, నటుడూ కలిసి మన మీద కుట్ర పన్నుతున్నారా అనిపిస్తుంది. అనుకుంటూనే వలలో పడిపోతాం"

**- ఆకాశవాణి**

"ఈ శతాబ్దపు తొలిపాదంలో ప్రసిద్ధిలోనికి వచ్చిన నవ్యులలో ఎన్నదగిన ప్రతిభావంతుడు. పలుకులు మెత్తనివైనా పలుకుబడి మహాతీవ్రమైనది. కావ్యరంగాన్ని కదనరంగంగా చేసుకుని విజయలక్ష్మిని చేపట్టి 'కవిపాదుషా' అనిపించుకున్నారు. వీర రసాన్ని పోషించడంలోనూ, దేశికవిత చెప్పడంలోనూ ప్రతిభావంతులు. గోవత్సము, ఏరువాక, దారా మున్నగు కావ్యాలు రచించారు."

**- కలకత్తా ఆంధ్ర సాహిత్య పరిషత్తు**

"పువ్వాడ వారు తెలుగుసాహితీ లోకంలో ఒక క్రొత్త దివ్వె చేతబట్టి, ఆ వెలుగు పయినించిన, పయనిస్తూన్న కవిపుంగవులు. వీరి రచనల్లో భావశబలతను మించిన భావోద్రేకం, కవితావస్తువును మించిన కరుణావేదం, ఛందస్సును మించిన భావబంధురత గోచరిస్తాయి. వీరు చాలా కావ్యాలు, నవలలు, నాటకాలు వ్రాశారు. సారస్వత విషయాల మీద అనేక విమర్శనా వ్యాసాలు వ్రాశారు. శతపత్రం, తాజమహల్, దారా, పాలవెల్లి, మొదలైన కమ్మని కావ్యాలు వీరి కలం నుంచి వెలువడ్డాయి. ఏరువాక, ఔరా!, ఎవరు? ఆంధ్రతేజం మొదలైన గద్య కావ్యాలు ప్రచురించారు. దుర్గాదాసు, ఢిల్లీ దర్బారు, నాటకాలు వ్రాశారు. రేడియోలో వీరి రచనలు చాలా వెలువడ్డాయి. 1958 లో రిపబ్లిక్ మహోత్సవాలలో ఢిల్లీ రేడియో కేంద్రంలో ఏర్పాటు చేసిన కవిసమ్మేళనానికి శేషగిరిరావు గారు ఆహ్వానింపబడ్డారు. వీరికి 'కవిపాదుషా' బిరుదునిచ్చి గౌరవించిం దాంధ్రదేశం. పద్యపఠనంలో వీరిదొక ప్రత్యేక ఫక్కీ, క్షేత్రయ్య గారి జన్మస్థానమైన ' మొవ్వ' వీరి జన్మస్థానం.

**- తెలుగు కలాలు**

(ఆంధ్రప్రభ - సచిత్ర వారపత్రిక)

# WHO'S WHO

( From 'Times of India – Year Book' )

Puvvada Seshagiri Rao, Kavipadusha, poet, scholar, and writer of Andhra. Born in Movva. 1906. Is an educationist of high repute; addressed, and presided over numerous literary and cultural meetings all over India; also a broadcaster; participated in the National Symposium of Poets inaugurated by President Rajendra Prasad on the Republic Day 1958 ; Member, Advisory Panel Anglo-Intra-Indian-Multi-lingual Dictionary, Director, Dramatic Association; strives for communal harmony.

*Publications:* Kavyas, novels, plays and essays.

*Poems :* Satapatram ; Govatsam; Tajmahal; Dara; Palavelli.. Prescribed as Text books of Modern Poetry for Degree Examinations in Andhra , Madras and Utkal Universities.

*Prose :* Eruvaka; Aura; Evaru; Andhra Tejam; Parasuramudu; Madhukalasam

*Plays:* Durgadas; Delhidurbar; Tissaparishkaram; Prithviputri; pranarakshana; Pratapa Rudrama Devi; Sahapankti; Silpakavyam; Totrupatu; Lakshmi Swayamvaram, Nandanar etc.

*Ballad :* Raktatarpanam.

*Address:* Bhaskarapuram, Machilipatnam (A.P.).

# శత పత్రము

ఇది పద్యగ్రంథము. ఇది ప్రధానంగా తిరుపతి వేంకటేశు నుద్దేశించి వ్రాయటం జరిగింది. చాలా వరకు పద్యాలు 'తిర్పతి వేంకటేశ్వరా' లేదా 'వేంకటేశ్వరవిలాస' మకుటంతోనే ముగించటం జరిగింది. జిజ్ఞాస, అర్చన, సమీక్ష, అవేక్ష, పరీక్ష, వివక్ష, దిదృక్ష ఆరోహణాక్రమంలో రచయిత వేంకటేశ్వరునకు శతపత్రం సమర్పించుకున్నారు. . . . .

పాదపూజాగురుస్తుతులతో కవి వేంకటేశ్వరుని యందు తమకు గల భక్తి ప్రపత్తులనూ గురుభావాన్ని సువ్యక్తం చేసుకున్నారు. శ్రీపువ్వాడ కవిత తేనెలొలుకుతూ ఉంటుంది. భావగర్భితమైన రచన, ఉదాత్త భావోద్రేకాన్ని కలిగించే పదజాలం, భక్తిభావాన్ని ప్రేరేపించే రచన...

అడుగడుగునా భక్తి భావం ఉట్టిపడుతుంది. జిజ్ఞాస వ్యక్తమవుతుంది. ఆవేదన ద్యోతకమవుతుంది. కవికి వేంకటేశ్వరుని మీద గల అవ్యాజభక్తి ప్రపత్తి ప్రతిపదంలో సుబోధకమవుతుంది. ఆధ్యాత్మికవిద్యయం దాసక్తి గలవారు మనసారా చదివి ఆనందించగల ఉత్తమోత్తమమైన గ్రంథమిది.

పూవువాడలొ పొత్తులలో మరందములు పొంగునిరంతము-అన్న కవి వాక్కు అక్షరాలా యదార్థమన్న విషయం 'శతపత్రము' చదివిన ప్రతి పాఠకునికి స్ఫురించకపోదు. భక్తిపూర్వకమైన ఇట్టి రచనలు ఎన్నైనా అవసరం.

**- ఆకాశవాణి, విజయవాడ**

28-11-1959

# సూచి



## ఆరోహణము



చిత్తరళాయమాననిజచిత్తసరోజదళాంతరేఖ ల
ష్టోత్తరమౌ శతమ్ము పదయుగ్మముఁ బొత్తులుచేసె నీకు, నీ
చిత్తము వానిభాగ్యమని శేషగిరీశుఁడు; పూవువాడ లౌ
పొత్తులలో మరందములు పొంగు నిరంతము వేంకటేశ్వరా !



ఓమ్

# శత పత్రము

## పా ద పూ జ

శ్రీమత్తిర్పతివేంకటాద్రిమకుటశ్రీరత్నరించోళికా
ధామా ! రక్షణకంకణాభయదముద్రాభద్రహస్తద్వయీ
స్థేమా ! భీషణశంఖచక్రయుగళీదివ్యాంగుళీసీమ! రా !
ఓమన్ రా ! కరుణింపురా ! ప్రణుతిరా ! ఓం వేంకటాద్రీశ్వరా !

శ్రీమద్దేవకిరీటచుంబితనిజశ్రీపాదమంజీర ! మం
గామాంజిష్ఠపదాబ్జనూపురనమన్మాణిక్యకోటీర ! మా
ప్రేమారామమధూళికామృగమదశ్రీగంధశృంగార ! రా !
ఓమన్ రా! కరుణింపురా ! ప్రణుతిరా ! ఓం వేంకటాద్రీశ్వరా !

శ్రీమన్నీల విహాయసస్థగనచాంద్రీభూతతారావళీ
సీమామధ్యశరత్సుధాకర ! సమీచీనప్రసూనప్రభా
దామారామనిరంతమాధవజగత్సమ్మోహనాకార ! రా !
ఓమన్ రా ! కరుణింపురా ! ప్రణుతిరా ! ఓం వేంకటాద్రీశ్వరా !

స్వర్గంగాలహరీపయస్సుకవితాస్వారస్యపారమ్యముల్
స్వర్గద్వారకవాటభేదనచణస్వైరప్రభారమ్యముల్
సర్గానర్గళలోకపాలనకళాసంస్కారసంభారసం
సర్గంబుల్ గద త్వత్కృతీశమహిమల్ మద్వేంకటాద్రీశ్వరా !

కవి ననుకోఁగ సిగ్గగునుగా ! కల మాడునె నీవులేక ? యి
క్కవితయ నీవు, నీవ కవిగా, పతి వీవగదా, మ ఱేనా? నీ
కవితను నీ కొసంగు మొనగాడ, నిదే శతకమ్ముగొమ్ము మ
ద్భవశతకమ్ము డుల్చుకొనెదన్ పరమేశ్వర ! వేంకటేశ్వరా !

కవికృతిభర్తృకీర్తు లొకకల్పమె నిల్చుఁ ద్రిమూర్తితత్త్వమీ
వవు శతకమ్ము సుమ్మిది శతాధిక కల్పము లెన్ని చూచునో !
రవిశశితారకాగ్రహపరంపర లెన్నిటి లెక్క పెట్టునో !
కవి కృతులుం గృతుల్ పతి జగత్పతియైనను వేంకటేశ్వరా !

వరములు వాడుకోఁజనని భక్తుఁడనై నిజశక్తి వమ్ముగా
జరపితి, మత్కృతీశ్వరుని జాలిన కానుకఁ దన్పనైతి సం
సరణపయోధిసంతరణశక్తి కొఱంపడి, **సుప్రభాత** సుం
దర **శతపత్ర** మిద్ది చరణంబుల నుంతును వేంకటేశ్వరా !

## గురు స్తుతి

నమోస్తు దేవాయ గురూత్తమాయ
నమోస్తు భద్రాయ నిరంజనాయ
నమోస్తు సిద్ధాయ పరాత్పరాయ
నమోస్తు ధుండాగురవే నమోస్తు.

గురుఁడు లభించుఁ దా వెదకికొన్న లభించునె? తత్త్వమిచ్చు త
ద్గురుఁడె గురుం డనన్యఫలదుం డతఁడబ్బె, నఖండభద్రసం
భరితముదశ్రుగండతలమండితుఁడైతి ననర్ఘదేశికో
త్తరదరహాసవాఙ్మధురధారలఁ జొక్కితి వేంకటేశ్వరా !

చిఱుతల నొక్క కేల నొకచేతను దంబుర కాళ్ల మువ్వలున్
శిరమునఁ గుచ్చుపాగ కటిసీమను దట్టి యురమ్మునందుఁ బూ
సరములు మేన నంగరఖ చాదువిబూది నొసంటఁ దాల్చి మం
దరగిరివోలె చక్రిభజనత్వరమాణుఁడు తోఁచె నీశ్వరా !

అంతేవాసులుగొల్వ మ్రోవబహువాద్యమ్ముల్ 'హరేరామ'నా
దాంతర్యామి గురుండు చక్రిభజనవ్యాసంగియై కాల్పడన్
వింతల్వత్సరపూర్ణయాత్రలను సేవించున్, ప్రభాతమ్ము భా
ష్యాంతమ్ముల్ శ్రుతిపాఠముల్ కఱపునౌరా ! వేంకటాద్రీశ్వరా !

తీర్థములన్ని మెట్టి చవిదేఱిన పాదముతీర్థ మబ్బె నే
దీర్థము మెట్టనేలొకొ ? శ్రుతిస్మృతిమూర్తి లభించె నింక వే
దార్థము ముట్టనేల ? పురుషార్థతురీయకరావలంబి లో
నర్థము కాఁగ నాకుఁ బరమార్థము వేఱయ ? వేంకటేశ్వరా !

వేదము మూర్తిమంతమయివెల్గెనొ కన్నిఱుమిట్లుగొల్పి ? శ్రీ
పాదము ఘల్లుఘల్లుమన ద్వారము మెట్టిరొ రామచంద్రు ? లీ
మాదుగృహమ్ము పావనము మద్గురుపాదులువచ్చి యచ్చపా
దోదకమిచ్చి రిందు, జని యుండునె మాకిఁక వేంకటేశ్వరా !

గురుచరణారవిందసుధ గ్రోలెడి కూటజడుండు తద్జ్ఞుఁడౌ
గురపదసేవ చేకూఱని కోవిదుఁ డజ్ఞుఁడు, తద్గురు ప్రభా
భరమున మన్మనోలఘిమపాసెఁ గృతార్థుని సల్పుమింక సం
సరణమహాబ్ధిసంతరణసంజ్ఞను జూపుమ ! వేంకటేశ్వరా !

# సు ప్ర భా త ము

## (అనువాదము)

లెమ్ము రామచంద్ర ! లే నరశార్దుల !
సుప్రభాతసుప్రసూత సంధ్య
కల్యములను దీర్పఁ గౌసల్యసుప్రజ !
మేలుకోవె ! శేష శైలవాస !

లెమ్ము లేలెమ్ము గోవింద ! లెమ్ము గరుడ
వాహనా ! లెమ్ము కమలామనోహరాంగ !
ముజ్జగమ్ముల మంగళమ్ములు ఘటింపు
సుప్రభాతము శేషగిరిప్రసన్న !

శ్రీజగన్మాత ! హర్యురశ్శ్రీమనోజ్ఞ !
శ్రితజనప్రియదాత్రి ! దివ్యతమమూర్తి !
శ్రీమహారాజ్ఞి ! వేంకటస్వామిగృహిణి !
సుప్రభాతము శేషగిరిప్రసన్న !

కమలలోచన ! చంద్రముఖప్రసన్న !
శివవిధీంద్రసతీసమర్చితపదాబ్జ !
వృషగిరీంద్రప్రియా ! దయామృదులహృదయ !
సుప్రభాతము శేషగిరిప్రసన్న !

అత్రిముఖసప్తఋషులు సంధ్యలను వార్చి
అమలపదయుగ మర్చింప నమరసింధు
కమలములు తెచ్చి యార్తులై కాచుకొనిరి
సుప్రభాతము శేషగిరిప్రసన్న !

ఆచతుఃపంచషణ్ముఖు లమరవరులు
ప్రస్తుతింతురు శ్రీత్రివిక్రమచరిత్ర
బ్రహ్మ వాసరశుద్ధిమంత్రము పఠించు
సుప్రభాతము శేషగిరిప్రసన్న !

దరహసితవారిజోత్కరసరసనారి
కేళపూగద్రుమమనోజ్ఞపాలికాది
సౌరభవహుండు పట్టు వింజామరలను
సుప్రభాతము శేషగిరిప్రసన్న !

కనకపంజరశుకపాళి కనులువిప్పి
మెసవ మిగిలిన కదళికారసవిశిష్ట
పాయస మ్మాని మేల్కొల్పు వల్లెవేయు
సుప్రభాతము శేషగిరిప్రసన్న !

మధురనిస్వనతంత్రికామహతి మీటి
యంగుళీచారరమ్యభాషాసమాన
హరికథావళి నారదుఁ డాలపించు
సుప్రభాతము శేషగిరిప్రసన్న !

మధురసావిష్టఝుంకారమధురగీతు
లామతింపగ నిందిందిరాళి యొలి
సవిధసరసీజగర్భవాసమ్ము విడిచె
సుప్రభాతము శేషగిరిప్రసన్న !

గొల్లపడుచులు దధి చిల్కుకొనెడి మ్రోఁత
లెల్లవ్రేపల్లె మ్రోఁగఁ, గవ్వించు కొనియె
రోదసీకుంభదధికుంభరోషకలులు
సుప్రభాతము శేషగిరిప్రసన్న !

పద్మపతిమిత్రశతపత్రబంభరాళి
కువలయశ్రీ నిజాంగలక్ష్మ్మల హరింప
నెత్తె భేరీనినాదఝుంకృతుల దాడి
సుప్రభాతము శేషగిరిప్రసన్న !

శ్రీనిధి ! యభీష్టవరద ! శ్రీ శ్రీనివాస !
లోకబంధు ! జగద్దయాత్మైకసింధు !
శ్రీగృహాత్మభుజాంతరసిద్ధమూర్తి !
సుప్రభాతము శేషగిరిప్రసన్న !

హరవిరించిసనందను లాప్లవించి
స్వామిపుష్కరిణిన్, ద్వారసీమ నిల్చి
వేత్రహతశీర్షులై శుభావిష్టులైరి
సుప్రభాతము శేషగిరిప్రసన్న !

వృషభశిఖరియు వృషగిరి వేంకటాద్రి
గరుడనగము నారాయణాగమ్ము శేష
శైల మాదిగ నీనివాసమ్ము పేళ్ళు
సుప్రభాతము శేషగిరిప్రసన్న !

ఆనతనిజోత్తమాంగబద్ధాంజలులయి
శ్రీమహేశేంద్రవహ్నిపరేతరాట్ప్ర
చేతసానిలధనదు లాసింత్రు సేవ
సుప్రభాతము శేషగిరిప్రసన్న !

విహగ రాజ మృగాధిప ద్విరదరాజ
నాగరాజ హయాధిపుల్ సాగినారు
స్వాధికారమహత్త్వాదికార్థు లగుచు
సుప్రభాతము శేషగిరిప్రసన్న !

సూర్యశశికుజబుధగురుశుక్రసౌరి
రాహుకేతువు లమరధూర్వహులు నీకు
దాసచరమావధికదాసదాసు లరుగొ !
సుప్రభాతము శేషగిరిప్రసన్న !

తలలఁ ద్వత్పాదరజమును దాల్చువారు
స్వర్గ మపవర్గమును గోరు వలను చనక
ఆకులితచిత్తులైరి కల్పాగమార్తి
సుప్రభాతము శేషగిరి ప్రసన్న !

దవులఁ ద్వద్గోపురాగ్రముల్ తవులు చూపు
గములు స్వర్గాపవర్గపారములు కొలుప
మర్త్యలోకజనమ్ము నిన్ మఱఁగి నిలిచె
సుప్రభాతము శేషగిరిప్రసన్న !

శ్రీమహీపతి ! సద్దయామృతపయోధి !
దేవ దేవ ! జగచ్ఛరణ్యావతార !
ఆది శేషపతంగసమర్చి తాంఘ్రి !
సుప్రభాతము శేషగిరిప్రసన్న !

వారిజోదర ! దీనరక్షణపారిజాత ! జనార్దనా !
పూరుషోత్తమ ! చక్రపాణిరొ ! భూరివత్సకలాంఛనా !
శ్రీరమాధవ ! వాసుదేవ ! హరీ ! వికుంఠనివాస ! పృ
థ్వీరమాప్రియ ! సుప్రభాతము వేంకటాధిప ! మేలుకో !

మనసిజాహమికాహరాప్రతిమానమూర్తిమనోహరా !
ప్రణయినీస్తనపద్మకోరకరమ్యలోలదృగంతరా !
ఘనశుభంకరశీలసద్గుణకాంతకీర్తిదిగంతరా !
వినతిగైకొను సుప్రభాతము వేంకటాధిప మేలుకో !

మీనకూర్మకోలమృగరాజముఖవర్ణి
రామరామరామరామకృష్ణ
కల్కిరూపధారి ! కదలిరా ! మేలుకో !
మేలుకోవె శేష శైలవాస !

హృష్టవైదికాళి యేలాఫలలవంగ
ఘనసుగంధదివ్యగాంగవారి
పూర్ణకనకకలశములఁ బూని నిలిచిరి,
మేలుకోవె శేష శైలవాస !

భానుఁ డుదయమందెఁ బద్మముల్ వికసించె
విహగరుతులు దెసలఁ బిక్కటిల్లె
మంగళార్థపరమమతులు శ్రీవైష్ణవుల్
మేలుకోవె శేష శైలవాస !

అజుఁడు సురమహర్షు లాసనందనయోగు
లతులమంగళార్థహస్తులగుచు
ధామమందు నిలిచి రామతింపఁగ నీకు
మేలుకోవె ! శేష శైలవాస !

శ్రీనివాస ! నిరుపమానగుణాంభోధి !
వేదవేద్య ! ఆత్మవిభవభక్త
భోగ్య ! భవపయోధిపూరసేతుస్వామి
మేలుకొనె ! శేష శైలవాస !

వృషగిరీశమహిమ మీ సుప్రభాతము
ప్రతిదినమ్ము వేకువని స్మరించి
పఠనసల్పు నరుల ప్రజ్ఞలు పరమార్థ
సులభసుముఖ లగును సూవె స్వస్తి.



# జిజ్ఞాస

కలియుగమందు వేంకన జగత్ప్రభువన్నను నమ్మరేమి? యు
జ్జ్వలమహిమాధురంధరభవత్పదయుగ్మరవిప్రభాశిఖా
జ్వాలనము చూడనోడి తలవాల్చి కరమ్ములుమోడ్చనోడి వెన్
దలఁగుదు రంతెకాని నిను నమ్మమియుండునె వేంకటేశ్వరా !

ఎడఁజనిరేని దూరమగుటేకద సర్వము ! త్వత్కృపానటత్
జలధితరంగమజ్జన మజస్రము దూరము, ముక్తిలక్ష్మియున్
వెలలు సుదూరమై, యిహమువీఁగి పరం బణ నేమిసేతు రీ
వెడగులు ? భక్తపోషణగవేషణతత్పర ! వేంకటేశ్వరా !

నిను శంకించి శఠించి నిల్చినను గన్పింతీవు నిష్ఠాగరి
ష్ఠన, కుత్సాహవిభుత్వమంత్రమహిమాశుద్ధాంతరంగమ్మునన్
గనగాలేక దివాంధమై నిలుచు జిజ్ఞాసావిహీనుండు నిన్
గనునే ! వేంకటనాయకా ! బుధమనఃకల్పప్రసూనాత్మకా !

భావభవాంగసౌష్ఠవము భాస్కరరుక్పరివేషపుంజముల్
ప్రోవుగఁబుట్టుబిడ్డతఱిఁ బొల్పఱి జీవముతక్కి గడ్డయై
పోవఁగనేల నేలఁబడి ? పుత్రుఁడుకాఁదగు పిండమొండు తా
జీవిగఁబుట్టుటేల ? మతిసేయర యజ్ఞులు వేంకటేశ్వరా !

ముక్కుకనుల్ చెవుల్ రసన పొందికతక్కవు, జీవుఁడొండె తాఁ
దక్కినతోనె సర్వమును దక్కను కర్మలఁ, ద్వక్కు కంపునం
జిక్కు, మృతిక్రమమ్ము నినుఁ జెప్ప గణింపర యజ్ఞులిద్ది, నిన్
దక్కి ప్రతిక్రియన్ సలుపుతద్జ్ఞుఁడెవండయ ? వేంకటేశ్వరా !

పుట్టువు చావు గుట్టు దెలుపుంగద ! నిత్యము చావుపుట్టువుల్
కట్టును కంట, వేఱొకటి గానము, కన్పడు నిత్యసత్యమున్
నెట్టి వితర్కముల్ బలియ 'నేతి' పథమ్ములు పట్టనేల ? నీ
గుట్టున బత్తిపెంచి నిను గొల్చుటయెప్పదె ? వేంకటేశ్వరా !

నాది కరద్వయమ్ము చరణద్వయినాది మనస్సునాది - యీ
నాదియటన్న తత్పురుషనామ మదేదయ ? అట్టె పంచభూ
తాదులు సర్వపంకజభవాండము లంగము, లంగియుండదే ?
ఏదది నీవుగాక ? పరమేశ్వర ? తిర్పతివేంకటేశ్వరా !

పూవుందళ్కొవ ? రందు బొడ్డడుగునం బొంగారు మారందపుం
బ్రోవెవ్వారు ? దిగంతమోహనసుమామోదమ్ముతానెవ్వ ? రా
తావుల్ పిల్వఁగ తేకుకందక మరందం బాను పుష్పంధయం
బేవా రీవువినాగ ? ఈ ప్రకృతిలోనే చూతు ని న్నీశ్వరా !

'ఉన్నాడా మఱిలేఁడ యెందుఁగననై యున్నాఁడ దేరూపువాఁ
డెన్నం దద్గుణమేమి యీ ప్రకృతి తానేయౌన వేఱా మఱే
నన్నందాననొక్కటా' యనుచు సర్వాయుష్యముంబుచ్చుచో
నెన్నండయ్యె నినున్ భజించుటలునిన్వీక్షించుటల్ మత్ప్రభూ !

ఉన్నావంచు భజింప నీవు తుది లేకున్నం బ్రమాదంబులే
దన్నా ! లేవని కర్మముల్ విడిచి వర్జ్యమ్ముల్ నరుం డెయ్దినన్
ఖిన్నుండౌఁదుదనీవయున్న యెడ ముంగేల్ కాల నాకుల్ వృథా
నన్నా ! 'అస్తి' యటన్నజీవిచెడఁడన్నా ! వేంకటాద్రీశ్వరా !

జీవిత మొక్కయాట, గ్రహజీవులు పావులు, నిళ్లు గళ్లు, నీ
త్రోవలెయెత్తు, లాశలెదఁదూఁగెడియాశలు, జాతమృత్యువుల్
పావులరాకపోక, లిల పట్టిక, కల్పమె యాటకట్టు, లో
కావనశక్తి పూరుషులె యాలుమగల్గద ! వేంకటేశ్వరా !

విచలజ్జగద్యంత్రవృత్తి, వృత్తికి శక్తి,
శక్తి నియంతృకశక్తి, యేది ?
పంచభూతక్రియాబలము, తత్ఫలము, తత్
ఫలదాయి, యొక్కఁడై నిలుచు నేది ?
సృష్టిస్థితిలయాత్మశీలమ్ము, తచ్ఛీల
మూలమ్ము, మూలాలవాల మేది ?
ప్రకృతిపూరుషబంధపరిణామ, మప్పర
మార్థతత్త్వమ్ము, తత్త్వార్థ మేది ?

అదియొ ? యామెయొ ? యతఁడొ ? యాద్యంతరహిత
వర్తియగునద్ది సంకల్పమూర్తి నాకు
ముగ్ధమోహనసుందరమూర్తి యదియ
తిరుపతినివాస ! వేంకటేశ్వర విలాస !

వేదవేదాంగాదివిజ్ఞానపాథోధి
నిన్ను గాదని యిందు నిలువఁగలఁడె ?
జపతపోనిష్ఠా ప్రచండమండితమూర్తి
నిన్ను గాదని యిందు నిలువఁగలడె ?
యజ్ఞయాగక్రియాహంకారవశవర్తి
నిన్ను గాదని యిందు నిలువఁగలడె ?
పాంచభౌతికశక్తి పరివేషభుజకీర్తి
నిన్ను గాదని యిందు నిలువఁగలడె ?

నిన్ను గాదని భువనముల్ నిలువఁగలవె ?
హరవిరించినారదపురందరసనంద
నాళి సేవితపాదపద్మాంబురాశి !
తిరుపతినివాస ! వేంకటేశ్వర విలాస !

భూర్భువస్సువరగ్రములు పట్టి లోగుట్టు
 లెఱింగి నీయింటిప ట్టెఱుగ నరిది
వసుధాప్రభానిలవ్యవకాశపంచక
 మ్మెఱింగి నీయింటిప ట్టెఱుఁగ నరిది
సచరాచరగ్రహాశక్తి సామర్థ్యమ్ము
 లెఱింగి నీయింటిప ట్టెఱుఁగ నరిది
పృథులశాస్త్రపురాణవృత్తమ్ము వ్యాసార్థ
 మెఱింగి నీయింటిప ట్టెఱుఁగ నరిది

ఇట్టి యలుపున కిలువేల్పు వెట్టు లయితి ?
శక్తి యెంచక భక్తి కె ముక్తియిడుదు
భక్తి కొఱవడ్డ శక్తులఁ బరిభవించి
తిరుపతినివాస ! వేంకటేశ్వరవిలాస !



# అర్చన

మందారకుందారవిందనాగాశోక
తైలముల్ మేన మర్దనముసేసి
కస్తూరికాగురుఘనసారపంకముల్
నలుగిడి వెలలించి పలుకురాల్చి
గొజ్జగ పన్నీట మజ్జన మాడించి
యొడలెల్ల వెన్నెల మడుఁగులొత్తి
పునుఁగుజవ్వాదుల పొగలలోఁ గొనగోళ్ళఁ
గురు లార్చి క్రొవ్విరిసరులు చెరివి

ఆత్మమందిరనందనోద్యానసీమ
కోర్కిదగఁ దానమాడించుకొందు నిన్ను
ముగ్ధమోహనసుందరమూర్తి యేది?
తిరుపతినివాస ! వేంకటేశ్వరవిలాస !

సొంకవమృగమదచందనాగురులేప
ములు మేన సవసవ నలఁది యలఁది
బృందావనవసంతమందానిలమ్ములు
పిడిచిన పుప్పొడు లొడల నద్ది
పీతాంబరముగట్టి పింజెలసరిగించు
చీనాంశుకము కటిసీమఁ జుట్టి
పూర్ణేందుఘనసారపుండ్రమధ్యంబునఁ
గుంకుమపువ్వుతేకు కుస్తరించి

ఆత్మమందిరనందనోద్యానసీమ
కోర్కిదగదీఱఁ గైసేసికొందు నిన్ను
ముగ్ధమోహనసుందరమూర్తి యేది?
తిరుపతినివాస ! వేంకటేశ్వరవిలాస !

మరతకమాణిక్యమణిహేమకింకిణీ

క్వణితనూపురములు కాళ్లఁ దొడిగి

వజ్రవైదూర్యనిర్వ్యవహితాంగదలస

త్కేయూరతతి భుజాంకిత మొనర్చి

హరినీలపద్మరాగాభిశోభితములౌ

దండకడెమ్ము లొందగ నమర్చి

లలిత ప్రవాళాచ్ఛలసితమౌక్తికహార

ములు కంఠలంబితములు పొనర్చి

ఆత్మమందిరనందనోద్యానసీమ

కోర్కిదగదీఱఁ గైసేసికొందు నిన్ను

ముగ్ధమోహనసుందరమూర్తి యేది?

తిరుపతినివాస ! వేంకటేశ్వరవిలాస !

కలధౌతపదయుగవలయముల్ తలఁదాల్చి
యమరదుర్లభసౌఖ్య మవఘళింతు
తరళలోచనపద్మదళగళన్మధుధుని
చూపుకోపుల ద్రావి చూఱఁగొందు
నీలమేఘచ్ఛాయ లేలు ప్రన్ననిమేన
మనసుతో వీచోపులను ఘటింతు
కౌస్తుభమణిఘృణిక్రమవక్షస్థ్సలీ
జ్యోత్స్నలో విహరించి చొక్కి నిలుతు

ఆత్మమందిరనందనోద్యానసీమ
కోర్కిదగదీఱ సేవించుకొందు నిన్ను
ముగ్ధమోహనసుందరమూర్తి యేది?
తిరుపతినివాస ! వేంకటేశ్వరవిలాస !

పూవుల్‌దండలుగ్రుచ్చి మోపులుగ మూపుల్నింపనా? గంధపుం
దావుల్ చామరమూఁచివీచుదున? మేనన్ దూపముల్ జోపనా?
దీవెన్ నీవెలుఁగుల్ వెలార్చుదున? మాధ్వీపాయసాన్నంబులన్
నైవేద్యమ్మిడి యిత్తునావిడియమున్? మద్వేంకటాద్రీశ్వరా !

ఆఱుచక్రంబుల యవలిదే యందువా
ఆఱుకొండలపైని యమరశిఖరి ?
సప్తర్షి సవిధసాక్షాత్కృతుం డందువా
ఏడుకొండల వేంకటేశ్వరుండు?
సప్తసాగరతీర్థసంగమం బందువా
స్వామిపుష్కరిణికాసారసరము ?
సప్తస్వరాలాపసారస్య మందువా ?
ఘంటికాద్వయసమౌంకారరవము ?

సప్తకము ' వేంకటేశ్వరస్వామి' నామ
వర్ణక మ్మందువా ? తెల్పు భావమేమొ ?
గోచరమ్మౌలె మదగమ్యగోచరములు
తిరుపతినివాస ! వేంకటేశ్వరవిలాస !

ఆర్షము భారతమ్ము సుకృతాత్ములు భారతవర్ష జన్మసం
హర్షులు, నందుఁ బూజ్యులు మహాక్రతుహోమసమర్చనాసము
త్కర్షులు, వేంకటాధిపపదస్థిర భక్తులు సోమయాజిదు
ర్ధర్షపదాధికుల్, కొలుతుఁ ద్వత్పదయుగ్మము, వేంకటేశ్వరా !

కలవారు లేనివారలు నాక సాష్టాంగ
దండాకృతుల వెన్నుదట్టు నీడ
ఆపదమ్రొక్కుల నంది చేయందిచ్చి
చేఁదుకోఁగల్గు జేజేలఱేఁడ
డబ్బుడిబ్బెమ్ము లోడగ గుంజి గొలుసుల
పసుపుజోలిని బట్టి కొసరు ప్రోడ
సిరము నున్నగఁజేసి చెంపఁ జెప్పున వ్రేసి
నిలువుదోఁపులుగొని వెలుఁగువాఁడ

ఏడుకొండలవాఁడ యారేడుజగము
లేలు నలి వేలుమంగమ్మ యెమ్మెకాఁడ
వడ్డికాసులవాఁడ నా ప్రాపుకాఁడ
తిరుపతినివాస ! వేంకటేశ్వరవిలాస !

ముడిచినచేతులాపదల మ్రొక్కులు బంగరుసొమ్ములూడ్చి క్రొ మ్ముడుపులు గట్టుటల్ సఫలముల్ గనుటేతడ వింటికన్న నీ గుడి పదిల మ్మటంచు నడుగున్మడు గిచ్చుచు బిచ్చమెత్తి నీ కడ ధనికాలి వాకిలిని గాతురు కొంకక వేంకటేశ్వరా !

న భక్తి నిన్ను గడపన్ గడపం దలపోసి, పూర్వక
ము శమింప నంత్యశిఖరమ్మున ముక్తులు భక్తకోటి నాఁ
ంజనాభ ! నేఁడును భయావహయానము నెక్కి నీదు నా
౩ జపింత్రు కర్మములు మాయఁగఁ దిర్పతివేంకటేశ్వరా !

తమ్రమొక్కు తనయుల తరము తత్తనయుల
తరము దాటినఁ దీర్ప జరపువారి
ఆపదల్ తలఁగి యనంతర మ్మవి తలం
పునకు రాకయ మేలుకొననివారి
మ్రొక్కాదమఱచి మఱొక్కటి చెల్లించి
యెఱుఁగని దోసమ్ముఁ బొరయువారి
ఒకకొన్ని జరపి వేఱొకకొన్ని కలిపి సే
వలలోనఁ దడబడి కొలుచువారి

జ్ఞప్తి కెలయించి యలయించి సంకటములు
సంఘటించి కలంచి చేజాఱనీవు
నిను వినా కోర నొరుల నం చనిన జాలు
తిరుపతినివాస ! వేంకటేశ్వరవిలాస !

తుమ్మెదఱెక్కల ఱెమ్ము పెన్నెఱికురుల్
దేహాభిమానమ్ము తీఱఁ దఱిగి
తులదూఁచఁదగు నగల్ నిలువుదోఁపుల నిచ్చి
కనకాభిమానమ్ము కాన్క వెట్టి
సాష్టాంగ మెరగి కన్నద్ది యంజలివట్టి
మానాభిమానముల్ మట్టుపఱచి
'అన్యధా శరణమ్ము నాస్తి నాస్తి' యటంచు
నాత్మాభిమానమ్ము నవలఁద్రోసి

ఆసలకు వచ్చి యాసలు కోసికొంఁద్రు
ముడుపు గొనివచ్చి ముక్తిని ముడుచుకొంఁద్రు
మోహితప్రజ మాఱి నిర్మోహితులుగ
తిరుపతినివాస ! వేంకటేశ్వరవిలాస !



# సమీక్ష

జననము తప్పదాయె, నది సంస్కృతికిన్ మొదలాయె,మున్గియున్
మునుఁగకుమందువాయెఁ బరముందలపెట్టఁగనీని మోహముల్
కనుఁగవ గప్పునాయె,నెటుకందు నినుం? గననో జనుర్మృతుల్
దొనదొనఁ గూఱునాయె, దరితోఁచదు తిర్పతివేంకటేశ్వరా !

తొడనిడి తల్లి చన్నిడఁగ ధూర్తకుమారకుఁ డాట వేడుకన్
కడవిడి ధూళిధూసరితగాత్రముతో నొడిచేరుభంగి ని
న్నెడఁగొని సంస్పృతి ప్రబలవృత్తముతో దరిఁజేరినాఁడ, నా
యెడఁ గరుణాకటాక్ష మెలయింపవె ? తిర్పతివేంకటేశ్వరా !

నను సృజియించి జంటను బొనర్చితి, వంతటఁ బోక సంతతి
ప్రణయనిబద్ధుఁ జేసితి, పరంపర నర్భకులన్ యథాతథ
ప్రణిహితులం బొనర్తు, వివిరా చెఱలాటలు నీకు? మూషిక
మ్మున కివి ప్రాణగొడ్డములుపో ! జగదీశ్వర ! వేంకటేశ్వరా !

కనులుమొగిడ్చి కానము జగత్తు సుషుప్తిని, గన్ను విప్పియుం
గన మతిజాగృతిన్ స్వగృహకాంచనదారసుతాత్మరక్షణల్,
కనఁగల కన్నొకండె త్రిజగత్ప్రజనావనదక్ష మున్నదం
చునుగుణియింతుమేన్ మనఁజనున్ మముబోటులు వేంకటేశ్వరా!

తళతళతల్తళత్తళలధారలకత్తులు దూసి నేత్రముల్
మిలమిలలాడఁగా నశని మించిన మించునొకండు తట్టుకో
బలమది చాలదాయెను భవద్బలమొండె శరణ్యమాయె నీ
బలమె బలమ్ము మాకిలఁగృపామయ! శ్రీమయ ! వేంకటేశ్వరా !

నియమితకార్యధూర్వహమనీషి యహస్కరుఁడొక్కఁడీమహా
వియదధికారియై కనులువిచ్చినఁ దట్టుకొనంగఁ జాలమే !
లయమునఁ బాత్రధారుల బలం బదియెట్టిదొ ? సూత్రధారి వ
వ్యయచిదచిత్స్వరూపమహిమాదు లవెట్టివొ ? వేంకటేశ్వరా !

కృతములు వెంటవచ్చి సవరింపఁగవచ్చును సర్వ మిం ద దే
గతి యనుచున్ సుకర్మము లొకండును జేయకయున్న నిందునం
దెతఁడు గడించిపెట్టు ? గడియించిన దున్నదిగాన భ్రింగితిన్
వితగననీక నన్ సుకృతవీధిని ద్రిప్పవె ? వేంకటేశ్వరా !

గతికిన్ ధర్మము పాదు, ధర్మగతిరక్షం దప్పి వర్తింప న
చ్యుతుఁడైనం జ్యోతిగాంచు, గర్భనరకం బొందండె నానాజను
ర్భృతుఁడై తత్ భృగుదారకంఠదళనోద్వృత్తిన్, నిరంతప్రభా
మతి గొల్పంగదె నాకు ధర్మనిరతిన్ మద్వేంకటాద్రీశ్వరా !

కృతముల్ విఘ్నకృతమ్ము, లాశలు లతాంగీమూలకందమ్ము, లీ
మతికిం జాపలవృత్తివృత్తి, కవితామాన్యమ్మె మాన్యమ్ము, ని
ష్ఠితకర్మమ్ములు కష్టసాధ్యములు, తూష్ణీంభావముల్ యజ్ఞముల్
గతికిన్ నాయెడ భక్తి యెక్కడె సదాగణ్యమ్ముసుమ్మీశ్వరా !

ఒక్కరుఁ డందలమ్మునసెయుండ మఱొక్కఁడు మోయనేల ? వే
ఱొక్కఁడు నూఱువత్సరము లుండ మఱొక్కరుఁ డర్ధజీవియై
తక్కఁగ నేల? జీవిసుకృతమ్ములు దుష్కృతముల్ యథాగతిన్
లెక్కలు వేసియిచ్చు గజలెక్కలగాఁ డెవఁడయ్య? యీశ్వరా !

అమితమ్ముల్ నిజపాపపుణ్యములు గమ్యస్థానపర్యంతగ
మ్యములున్ జన్మపరంపరాసృజనమర్మమ్ముల్ గదా! పాపలే
శమునంబున్నెముమాయుబున్నె మఘమున్ క్షాళింపదావృత్తక
ర్మములన్ జీవుఁడు త్రోసిరాజనుట మేరా? వేంకటాద్రీశ్వరా !

యమతనయుండొకండనిలునాత్మభవుండొకడింద్రసూనుడొం
డమలిను లశ్వ లిద్దఱు, జనార్దను కూర్చుమఱందు, లాలు య
జ్ఞమహిమఁబుట్టె, నిట్టిరు క్షణమ్ము సుఖించిరె పంచపాండవుల్
కొమద్రుపదాత్మజాత? కనుఁగోఁ గృత మట్టిది వేంకటేశ్వరా !

జనకుఁడు కోసలేంద్రుఁ, డనుజన్ములుశూరులు, మామపూజ్యుఁడ
జ్జనక మహర్షి, ధర్మసహచారిణి సీత యయోనిజాత, పె
ల్చన నిజకింకరుండు హరిసత్తముఁడుం, బరమాత్మతా, నయో
క్షణము సుఖమ్ము దక్కెనె ? భృశమ్ముకృతమ్మది వేంకటేశ్వరా !

ఓయి మహానుభావ నిను నొల్లనివారలు చెల్లలేరు నీ
సాయము గోరువా రొరులసాయము గోరఁగలేరు కర్మముల్
పాయనివారె నిన్ను నెడబాయుదు రంతయుఁగర్మ భుక్తమై
పోయినవారు నీవలను పోదురు తిర్పతివేంకటేశ్వరా !



## అవేక్ష

వేదచోరుని బట్టి విదళించు చోఁటవు
        కొండకు వెన్నిచ్చు కూర్మపతివి
మునిఁగిన యిలఁ గొమ్ముకొన మీటు కిటివియుఁ
        గంబమ్ము వెలలు సింగంపుదొరవు
బలిని ద్రొక్కిన ధూర్త వామనమూర్తివి
        బ్రాహ్మ్యమ్ము క్షాత్రమ్ము పట్టు కృతివి
ఆదర్శనిజధర్మకోదండపాణివి
        పృథివి గీతాచార్యపీఠమవును

జ్ఞానమూర్తివి కలియుగంధరుఁడ వీవు
క్రమపరిణతమ్ము లవతారగమనదశలు
గోప్యములె నాకు నీ శ్రితకోటివాఁడ ?
తిరుపతినివాస ! వేంకటేశ్వరవిలాస !

వామభాగమును సీతామహాలక్ష్మి ద
క్షిణము లక్ష్మణమూర్తి స్వీకరింప
ఉభయపార్శ్వదళమ్ము లొంది వినమ్రులై
భరతశత్రుఘ్నులు తుఱఁగలింప
పదముల హనుమ కైవ్రాల సుగ్రీవాంగ
దులును విభీషణాదులును గొలువ
వామ దేవవసిష్ఠపరమర్షితత్త్వార్థ
భాష్యనిర్వచన మంబరము నొరయ

అచ్ఛశరదిందుకుందసౌధాంతరమున
మణిమయోజ్జ్వలమండపమధ్యపీఠి
వెలుఁగు పట్టాభిరామదిగ్విజయమూర్తి !
తిరుపతినివాస ! వేంకటేశ్వరవిలాస !

వరములు పొంది నీకు వనవాసము గూర్చిన కైకకై తుదిన్
వరములు పొంది తన్నరకవాసము మాన్పి యనుగ్రహించు నీ
కరుణకు, శత్రుసోదరుని గాచిన నీ దయ కేని, మాదృశుల్
తరుగయిపోయిరే ? కృపను దాఁచకు తిర్పతివేంకటేశ్వరా !

సుహృదుని నేడుజన్మములు స్రుక్కినగాని గణింప వుగ్రుఁడై
యహమహమించు శత్రువున కక్షయమోక్షము తక్షణింతు, వీ
రహి నిజధర్మమేని గుణరమ్యులు నొత్తురు మెత్తు రన్య, లీ
యిహమున నిన్ను గొల్చు పురుగెక్కడిదింకను ? వేంకటేశ్వరా !

లక్షల రాచబొక్కసము లగ్గని దొంగిలి తెచ్చి పెట్టె నీ
రక్షనునమ్మి దాసొకఁడు, రాయిడియే ఫలమయ్యెఁదొల్త, త
త్తక్షణమీయఁబుట్టదొకొ ? 'తానిష'కుం దుదకిచ్చు సొమ్మ దే
భిక్షనుకొంటి చేకొనిన పెన్నిధి ? తిర్పతివేంకటేశ్వరా !

గిరికొని పొంగు గౌతమిని గ్రిందొనరించి సఖీసహోదరుల్
గిరికొన నిన్ను భద్రగిరికిం గొని ప్రాణము మాన మమ్ము కిం
కరు నలయించి కాచి, నరఘుస్మరు రావణు సత్వరాత్మ మో
క్షరుచి ఘటించి ప్రోతు, వవగాహన మానొకొ ! వేంకటేశ్వరా !

భరతుని పచ్చలపతకమ్ము దిగ్రమింగెఁ
బదివేల వరహాల పైఁడిమూట
ముద్దులలక్ష్మణు ముత్యాల పతకమ్ము
పదివేల వరహాలు పట్టి త్రావె
శత్రుఘ్ను మొలత్రాడు సవసవగా గుంజెఁ
బదివేల మొహరీల పట్టుసంచి
సీతమ్మతల్లికై చింతాకు పతకమ్ము
పదివేల మొహరీలు పాదుపుకొనియె

రామచంద్రుని కలికితురాయి విలువ
గోపన యెఱుంగుఁ గూర్చుండి కులుకు దొరకుఁ
జెవినిబట్టద దాసు శోషిలెడు దనుక !
తిరుపతినివాస ! వేంకటేశ్వరవిలాస !

కొలువనివారు నిశ్చలులు, కొల్చెడివారలె శోషితాత్ములై
నలిగి కృశించి నీ కృప వినా గతిగానరు చాలుచాలు నీ
కొలువున కీడ్చుకోఁగలుగు క్రూరవిధమ్మిది ధర్మమా! జగత్
ప్రళయపుమర్మమా! తెలుపు తండ్రి ! రహస్యము వేంకటేశ్వరా !

నీవొక యర్థివైనపుడు నే నని యాలికి నాలిఁ గూర్చు సు
గ్రీవుఁడఁగాను, స్వామిపనికిన్ నిను సంతసపెట్టు నంజనా
దేవిసుతుండఁగాను, గుటిలించిన రాజ్యము గోరి వచ్చు త
ద్రావణసోదరుండ ననరా, దెటులేలుదు ? వేంకటేశ్వరా !

అవసరమున్నఁ గింకరుఁడ వౌదువు, వ్యర్థుని నన్నుఁ బ్రోవ నీ
కవసర మేమితీఱఁగల దయ్య ? సమస్తము తీఱె మున్నె యా
యవతరణమ్మునన్,జడుఁడనైకయిమోడ్చెదఁ బాద మొత్తెదన్
పవలును రేయి నీ కొలువు పట్టెదఁ దిర్పతి వేంకటేశ్వరా !

శాణతనమ్మురా ! యదువిశాంపతి ! గట్టుననుండి గౌరి క
ల్యాణ మటంచు గీతను వెలార్చితి, రాముఁడె వెంగలప్పయై
ప్రాణము ధర్మసంగ్రహణమందు నలంచి వ్యయించెఁబో! బళీ!
జాణవు, 'చంపులే యతిథి సర్పము!' నందువు వేంకటేశ్వరా !

పిల్లనగ్రోవి పట్టి మురిపింతువు లోకములెల్ల, వల్లవీ
పల్లవపాణియుగ్మములుపట్టి హరింతు మనస్సరోజముల్
చెల్లుఁ గలారి కెంతపనిచేసిన, నశ్రమలబ్ధకీర్తి నీ
మొల్లముగాదె కృష్ణ ! యిదెపో యవతారము? వేంకటేశ్వరా !

పాలను గ్రోలి నాతియసుపంచకమానితి వత్తపొందునం
దేలి కుమారిఁగొంటి వొక ధేనుకుఁజంపి వృషమ్ముఁగూల్చి
పాలకుఁడైతి ఊలుగొని పచ్చనిచెట్టులు మాపితీవు పెన్
గాలినిబట్టి భూమియడఁగం బడమోదితి, వేంకటేశ్వరా !

లీలలు రూప్యముల్ హృదయలీలలు గోప్యము లార్షశిక్షణో
ద్వేలమహత్త్వశీలురకుఁ దేలియుఁ దేలవు లీలగా భవ
ల్లీలలు, పూర్వపుణ్యతరళీకృతచిత్తుల కించుమించు కా
బోలు నగమ్యగోచరుఁడవో ! కలిగోచర ! వేంకటేశ్వరా !



# పరీక్ష

అడుగులు తడఁబడ సుడిఁద్రిప్పి పడఁద్రోతు
పడఁబోవఁ బడనీక పిడికిలింతు
నడుము జౌజవ్వాడ నెడపెడ లాగుదు
పడఁబోవఁ బడనీక పిడికిలింతు
ఎడనెడ మెడపట్టి వడవడ వడకింతు
పడఁబోవఁ బడనీక పిడికిలింతు
గుండెలోఁ గుసిలింపుఁ గొండలు దొరలింతు
పడఁబోవఁ బడనీక పిడికిలింతు

బలుపు రానీక చానీక బడలనీక
గుటక దిగనీ కుమియనీక యటమటింతు
మొఱఁగి యాసలుగొలిపి విమోహపఱతు
తిరుపతినివాస ! వేంకటేశ్వరవిలాస !

విద్దెల నిత్తు గుప్పిలిని విప్పవు, కల్మి ఘటింతు సౌఖ్య మే
ప్రొద్దును బొందనీవు, పువుఁబోఁడినిగూర్తువు ముద్దుముక్కలం
బ్రొద్దులు పుచ్చనీవు, భవభూతివి బాపురె ! విప్రలంభముల్
ముద్దులె ? కాళిదాసరసపోషణచేయుమ వేంకటేశ్వరా !

శాపగ్రస్తుల ముక్తికై పుడమి నీ జన్మమ్ము, మజ్జన్మమున్
శాపగ్రస్తము, తద్విమోచనకు రక్షాకంకణ మ్మూని నీ
యీపాద మ్మిలు మెట్టినట్టిఫల మీవే ? భక్త హృన్మందిర
శ్రీపాలా ! కరుణాలవాల ! మదిడస్సెన్ వేంకటాద్రీశ్వరా !

నాయెడఁబ్రేమశూన్యమనినన్ సుతరామునుగాదు నీకు, నా
ప్యాయనత్వన్మహోదరదృగంచలదివ్యరుచిప్రసారముల్
కాయును గాదె హృత్కమలక్రమమహోజ్వలచిత్సుధాస్రుతిన్
రేయి బవళ్లు మై జలదరింపఁగఁ దిర్పతివేంకటేశ్వరా !

ఇడుమలమూసలోఁ బడి తపింతును, తప్తముకాక పైఁడికిన్
జడిమ తొలంగ, దేనగకు నన్నొకపూసను జేసి టంకపుం
బొడినిడి క్రొమ్మెఱుంగిడెదొ? పోల్పఁగలే నగసాలెసామి ! నీ
మెడ మణిపూసఁ జేసికొన మిక్కిలిమే నిది వేంకటేశ్వరా !

చిక్కులలోఁ దగిల్చి యవి చించుమటంచు వచించువాఁడ వీ
నొక్కులు తీపులెత్తి తెగనొచ్చిన నెమ్మది కేమితోఁచు ? నీ
యెక్కటిది క్కదొక్కటె మతించితిఁద్రిక్కులువెట్ట కింక నా
దిక్కగు ఘో రమేశ్వర ! పదింపది వేడెద వేంకటేశ్వరా !

అందఱు నర్జునుల్ ధ్రువులు నందువ నైష్ఠికచిత్తవృత్తి ? నీ
యందలి లోపమిద్ది సృజనావనకర్తవు నీవయౌట, నా
యందున గూడుకట్టు నియమాదికలోపము లెన్నఁబోక యీ
కుందు తొలంచు నీకరుణకుం దఱి యియ్యది వేంకటేశ్వరా !

నాచరణమ్ము లాత్మశరణమ్ములునా వచియింతు సృష్టి నీ
దై చరభావ మొండొకనిదా ? నిజశక్తి కిదా ప్రగల్భతా
సూచన? లెమ్ములెమ్ము! మదిస్రుక్కెఁ గృశించెనుమేను దీనులం
బ్రోచిన దిక్కు నన్నెటులఁ బ్రోవక తక్కును వేంకటేశ్వరా !

నీ కరుణాకటాక్షమున నెక్కొను తీపి మఱింత తీపి, నీ
రాక యి కంతకంతకు శరన్మధురమ్మగు రాక, నీదు చే
సోఁ కమృతంపువాఁక మదిసోలినవానికి, సర్వపౌరుషా
నీకము వట్టు వట్టిదయనీయున కీశ్వర ! వేంకటేశ్వరా !

కరిఁ గాచెన్ హరిఁబ్రోచె మోచె వసుధంగాపాడె గోపాలురన్
సిరులందూచెఁగుచేలుఁ బాండవజయశ్రీగూర్చెఁ దేర్చెన్ మహీ
సురులన్ విష్ణువుజిష్ణువన్న తొలిమెచ్చుల్ నమ్మెదున్ నన్నుఁద్వ
త్కరుణాసాగరవీచికాస్నపితుఁ గాఁగం జేయుదే నీశ్వరా !

ఏడంతస్థులమేడపైఁ గులుకు ఱేఁడేలా విచారించు మా
గోడుల్ ? నేలయెలుంగుకొండకెటులెక్కుంబొ మ్మటంచుల్కి నిన్
వేడీవేడక మిన్నకుందునె? కకుభ్భేద్యమ్ముగాఁ బిల్తు ని
న్నేడుంగొండలుకూఁతవేటులగుకుయ్యిన్ వేంకటాద్రీశ్వరా !

బిరుదము సార్థకమ్ము నిలఁబెట్టుకొనన్ బలమున్ననాఁడు, పెం
పఱిన నరుండె నీబిరుదుకైన పతాక జగత్త్రయంబునన్,
తఱి నను బ్రోతువేన్ పరువుదక్కు యశస్సునుజిక్కుఁ గాదయే
నఱిముఱి దిక్కులేని బ్రదుకౌనయ నీకును నాకు నీశ్వరా !

కలిమికె కోలుపా టనెడి కష్టము, లేమికి లేద, భర్తవై
వెలిఁగెడి నీకుఁ దొంటిపెనుపే కసుగందిన డిందు సర్వ, మీ
యలుపున కేమి లోటయ దయామయ ! నీ మరియాదనిల్పుకో !
గళితపురాప్రభాకలియుగంధర ! తిర్పతివేంకటేశ్వరా !

# వివక్ష

కాలము నీవయై నియతకాలకృతమ్ములు నీవయై ధరా
పాలకుఁ డీవయై నియమపాలితలోకము లీవయై జగ
జ్జాలమహేంద్రజాలకరచాలకుఁడీవయి నాయనాహతా
బ్జాలయకర్ణి కామృతవిహారము కోరితె ? వేంకటేశ్వరా !

కోయని పిల్చినప్పు డిదిగో యని వత్తువు, నన్ను బ్రోవరా
వాయనియంజలుల్ మొగుడవబాయనిపాయసపుంగ్రపారుఖురుల్
పోయుదు నాకుఁ బుక్కిళుల బుంగలు పొంగులువాఱ, నీవుగా
కేయధిపుండు నా హృదయమించును ? తిర్పతివేంకటేశ్వరా !

పేదకు హేమపాత్ర కనిపించినపోలిక ముగ్గితేలి ది
క్కేది నదీప్రవాహమున నేగిన జీవికిఁ దేప యందిన
ట్లాదరువయ్యె నీదయ మహాత్మ మదాత్మకుఁ గామితార్థ సం
పాదనమేమి లెక్క? ఘనమామతి ముక్తియు ? వేంకటేశ్వరా !

జన్నము చేసి దేవకులజన్మము పొందిన సౌఖ్యతృష్ణమై
మిన్నులబోనులోఁదవిలి మిట్టుదు ముక్తిని గోరకే భవ
త్సన్నిధికన్న నున్నతపదం బది సున్న ప్రసన్న మోక్ష సం
పన్నుని జేయు భక్తిరసభావము నిల్పుమ వేంకటేశ్వరా !

కుదిరిన భక్తి నీ కొలువుకూటమునం జొరలే, నహర్నిశల్
చెదరని నిష్ఠఁ గర్మములుసేయఁగలే,నతిథి ప్రమోదముల్
మెదలుపఁజాలఁ, ద్వచ్చరణమే శరణమ్మని నాన్యథామన
స్సదమలవృత్తి వృత్తిగొనిసాగుదుఁ దిర్పతివేంకటేశ్వరా !

వేదముపాఁ తగల్పఁగల వేత్తనుగాను, పురాణసారముం
జేదుకొనంగనోపఁ, జిదచిద్ జ్ఞరహస్యము ముట్ట శాస్త్రపుం
బాదును ద్రవ్వఁజాలను, భవత్పదపద్మరజః ప్రభావళీ
వేది శిరస్సు నుంచుకొని వేడుటె నేర్తును వేంకటేశ్వరా !

కలుముల ముంపులోఁ బొరలు గప్పును కన్నుల లేమిబాములం
గలఁగి మనంబు బెండువడి కస్తిపడుంగద యింద్రియాళి ని
ర్మలహృదయప్రసన్న రసరంజితమంజులత్వత్పదాంబుజో
జ్జ్వలులగు టెట్టు లీ యుభయజాతులు తెల్పుమ వేంకటేశ్వరా !

కొమరులు లేనివారు కనుఁగోనల నశ్రులతో నిరాశతోఁ
గుములుదు రింక సంతుగల కోవిదులున్ నిజపుత్రపుత్రికా
సముదయ మందె చూపుగుఱి సంధిల నిం దలపెట్టనోప రీ
తమము నడంచి నిన్ దరియు దారిని జూపుమ వేంకటేశ్వరా !

కలుముల నిమ్ము సంతతిసుఖమ్మును ని మ్మనహంకృతాత్మని
శ్చలమహిమమ్ము హృత్సరసిజాతనిరంతరసప్రసారది
గ్విలసితసౌరభమ్ము తులకింపఁగనిమ్ము భవత్ప్రభావ మం
జులలహరీ విలాసములఁ జొక్కి తరింతుము వేంకటేశ్వరా !

వలసినయట్టుతోఁచి తుది వమ్మగునొండు,మఱొండు ముందు ని
ష్ఫల మనిపించి భావిసుఖపాలనఁ జేయు, సకామకర్మలన్
ఫలితము శూన్యముం గడుప్రమాదకరమ్మనుజూవె ! నాకుఁగా
వలసిన వేవొ నీవ తెలుపంగల వర్మిలి వేంకటేశ్వరా !

నరజన్మం బిడి విద్దెనిచ్చి కవితానందమ్ము వర్షించి ని
ర్భరజిజ్ఞాస ఘటించి సంతరణ మార్గమ్ముం బ్రసాదింప వి
స్మరణంబొంది 'యవే వి వేవి' యని పృచ్ఛం జేయుదుంగాని నిన్
గుఱితింపంగలవాఁడు కోర్కులెడఁద్రొక్కన్ వేంకటాద్రీశ్వరా !

నిను జింతింపని కావ్యముల్ వృధలు, నిన్నే దాతగాఁ ద్రాతగాఁ
గొనకందంగలమేళ్ళు దుర్వ్యధలు, చిక్కుల్ తీఱ నిన్నెంచకే
మునుఁగంబాఱిన భోగముల్ కథలు, సొమ్ముల్ వాహనమ్ముల్ నిఁ
ల్మణిరాసుల్ నిధనాలవాలములు సుమ్మా వేంకటాద్రీశ్వరా !

నిరహంకారకృతాత్మసంయమనపాండిత్యమ్మె పథ్యమ్ము ని
న్నరయ న్నేతివివాదఘోషలగు నూహాగానవాద్యమ్ము, ల
ప్పరమీవై, గురువీవయై, గుఱియునీవై తోఁచినందప్పు ని
న్నెఱుఁగన్ సాధ్యమ యత్ననిష్ఠలకుఁదంద్రీ వేంకటాద్రీశ్వరా !

కవిని గవిత్వముంగడచి కన్ను నినుం జెవి నీదువాక్కునే
తవులఁ బురాణకావ్యరసధారలు క్రోలఁగనిమ్ము శబ్దపుం
జవి మరగించి యర్థముల చక్కిలిగింతఁ గరంచి మాయ లోఁ
గవియఁగనీకు సత్యమునె కాన్పుమ విన్పుమ వేంకటేశ్వరా !

మఱి సంకల్పము నీదుకల్పనము తన్మంత్రాళి తంత్రాళి త్వ
త్కరుణావీక్షణమాలికానిచయ మింక న్నేఁ గృతార్థుండగా
కెఱియంబోదునె? కీడొ మేలొ ఫలమేదే నిన్నె చెందున్మదిన్
మొఱలేలా ? మురిపమ్ములేల? వృధలే పో! వేంకటాద్రీశ్వరా!

అరిమాత్సర్యము చూచి బెగ్గడిలనేలా నాకు? సాయాసబం
ధురమాయాగతలోకపాశములఁ జిందుల్ ద్రొక్కనేలా? జగ
ద్ధురణుండే నను వెన్నుగాచి నడిపింపన్ ధర్మసంరక్షకై
అరినిర్భేదననిష్ఠురక్రకచచక్రా ! వేంకటాద్రీశ్వరా !

అరిషడ్వర్గవిమోహితాత్మధిషణాహంకారహుంకారు లీ
నరులా నా కగువారు సంసరణబంధగ్రస్తజీవాత్ము ? లం
బర కౌసుమ్యము వీరిసారు, హరిణాంభస్స్వాచి యివ్వారి తీ,
రరయం ద్వత్కరుణాకటాక్షములె నాకౌ, వేంకటాద్రీశ్వరా !

తటి దయగల్గెనేని ధ్రువతారను జేసి విహాయసమ్మునం
దుఱుముదు, లేదయేని దిగఁద్రొక్కి బలింబలె దిక్కులేని కా
పురుము ఘటింతు, నిన్ను సరిపోలిన ఱేఁ డిలఁ లేఁడు త్వత్కృపా
ఝురి తలమున్కగాఁ బఱపి సాకుమ ! తిర్పతివేంకటేశ్వరా !

కాచిన నీకెపేరు, ననుఁ గావకయున్న దశావతారముల్
మోచినపేరు జాఱు, జగముల్ యుగముల్ భరియించు ఱేనికా
ణాచికి నెగ్గుపుట్టిన క్షణమ్మె యుగమ్మయితీఱు నీవు నం
గాచినఁ గావకున్న బదకంజములన్ విడ వేంకటేశ్వరా !

త్వత్పాదరాజీవతతమరందానంద
మత్తభృంగము చేసి మనుపరాదో ?
త్వన్నామకీర్తనపంచమస్వరకంఠ
కలకంఠమును జేసి నిలుపరాదో ?
త్వత్తత్త్వపీయూషపానసంతుష్టామృ
తాంధస్సుగాఁ జేయ నలవిగాదో ?
త్వత్సన్నిధాననిత్యప్రాభవస్వామ్య
పరవశాత్ముని జేయ వలనుగాదో ?

త్వత్ప్రభావప్రభారంజితప్రకృష్ట
పరిణతాత్ముని జేసి చేపట్టరాదో ?
కోరి కొలిపించుకొని యేలుకొనఁగరాదో ?
తిరుపతినివాస ! వేంకటేశ్వరవిలాస !

లోఁతగు నీమనస్సు, చిటులుం జిటికెం జిటిచిట్టిపుట్టు వీ లేఁత మనస్సు, చీల్చి సడలింపగనోపదు పెందమస్సు, పై మూఁత తొలంచి నీ మనసుపొక్కిలి చిక్కుడి దారిచూపు, లే లోఁతులమారి నీమనసులో మనసయ్యెద వేంకటేశ్వరా !

# ౦ దృక్ష

ధరణీరసాతలచరణద్వయీపీఠి
కులమహీధ్రాంకజంఘల యుగమ్ము
శశితారకాసువిశాలవక్షోభూమి
వేదశాస్త్రభుజాగ్రవిలసనములు
ఇంద్రాదిదేవకర్ణేంద్రియమ్ములు, నాక
మేఘశిరస్సిరోజౌఘములును
సవితృ నేత్రానిలశ్వాసముల్, ఛందోఽగ్ని
వరుణవాణీముఖప్రరసనములు

మఱి యహోరాత్రనేత్రపక్ష్మలవివృత్తి
అరిషడుగ్రలలాటాధరాదికములు
కలుగు త్వన్మూర్తి యూహింపఁగలుగు మాత్ర
తిరుపతినివాస ! వేంకటేశ్వరవిలాస !

6

ఉడురాజవీధీసముత్సేధహిమధరా
ధరశిఖరాకృతి నురవడించి
శతసహస్రకరప్రచండ తేజఃపుంజ
ముఖమండల ముగ్రముగను దాల్చి
చతురబ్ధిముద్రితాశాభద్రభూఖండ
పరిమితపదయుగ మరిదిఁ జాచి
ఖడ్గతో మరగదోగ్రకరాగ్రకంపన
క్రమరేఖ మిఱుమిట్లుగాఁగఁ దోఁచి

వచ్చి నిలుతువ కనువిచ్చువచ్చు నెటుల ?
దిగ్భ్రమావృతిఁ గంపించి తేఱలేనొ ?
మూర్ఛ గవిసిన స్మృతిపథమ్మునకు రానొ ?
తిరుపతినివాస ! వేంకటేశ్వరవిలాస !

మందమందాయాతమలయమారుతపోత
        వీచికామాలిక లూఁచి తోఁచి
లలితకీరకిశోరకలహంసకోకిలా
        లాపసంభాషణోల్లాస మంది
చాంపేయపుష్పవిస్ఫారితామలదళా
        మోదసంపద యొక్కమూర్తి గట్టి
రాకేందుమండలప్రస్రుతామృతకర
        స్వచ్ఛధారాశైత్యసార మొంది

శృంగమును డిగ్గి యలివేలుమంగఁ గలిసి
వచ్చి నిలుతువ? యొడలెల్ల విచ్చిచూతు
ముగ్ధమోహనసుందరమూర్తి యేది?
తిరుపతినివాస ! వేంకటేశ్వరవిలాస !



# కాశీ సారము

## (శ్రీమచ్ఛంకరాచార్య విరచిత 'కాశీ సారము'న కనువాదము)

శ్రీశ ! మువురాండ్రఁ బ్రియతమ కాశి నీకు;
గజముఖుని గౌరి, షణ్ముఖు గంగ, కనగ
నిన్నె పురడించు నిటలాక్ష నీలకంఠ
చంద్రమౌళులఁ గను క్షణక్షణము కాశి.

అభినవేశ్వరసంతాన మనుదినమ్ము
నంది యో కాశి! కోశ గేహమునఁ గూర్ప
నెన్ని మిన్నేరు లెన్ని యర్ధేందురేఖ
లెన్ని బ్రహ్మకపాలము లివతళించు !

కాశికానూత్న పశుపతుల్ కలిసి యొకట
"నేను మశకమ, శశకమ నే" నటంచు
"ఏనుఁగను నేను, మనుజుఁడ నే" నటంచు
దత్పురాజన్మవృత్తముల్ తడువుకొండ్రు.

కాశికాజంతు చరమావకాశ మేమి !
పూర్వపుణ్యమ్ము పండి, శివుండు తాన
యొసఁగఁ, గొను జంతుతతి మంత్ర 'మో'మటంచు
వశమె వర్ణింపఁ గాశి నీశ్వరుఁడె గురుఁడు !

ఒడలు విడచిన నరుఁ డొందఁ దొడలు కాశి,
నొందెనో! ఇందుకళ మౌళి నొందుఁ గాక !
గళమునందున గరళము గనునుగాక !
ఒసపరి నొసంటఁ ముక్కన్ను నొందుగాక !

ఆలిపోరున కడలిన యతఁడు కాశి
నసువు లెడపిన నరమేన నందు నతివ,
సాగ రాంగనఁ దలపైన సవదరించుఁ,
గాశి మరణమె ముత్తెపు బాసికమ్ము.

చేరి వారణాసి శివరాజధానిని
తేరిచూతువేల దిక్కు దిక్కు
కూలఁ దన్ని నిధిని, కొలుతువే చండాలు ?
మూఢ! శివపదమ్ము ముక్తి పథము.

నాగలోకఫణులు నవరుద్రభూషలై
కాశిఁ జేరఁగా ఫణీశుఁ డొకఁడె
శేషుఁ డయ్యెఁగాన శేషనామమె నిల్చె,
చిలువతేఁ డనంగఁ జెల్లదింక.

కలవు బ్రహ్మాండముల క్షేత్రగణము లెన్నొ !
యుగయుగమ్మున నవి లయమొందు గాక !
రాజచూడామణిప్రభా రాజధాని
వారణాసియె చెడదు కల్పములు చనిన.

ప్రతిలతాతరు లాదిదంపతులు కాశి ;
లత లపర్ణలు తరుతతుల్ స్థాణు లయ్యెఁ
గురియు వాంఛితఫలములఁ గుంభవృష్టి ,
మ్రొక్కఁదగుఁ గాశి, నొగాక మ్రోడు రాయి.

నిరత మట విశ్వనాథు ధ్యానింపఁ దగుట
శ్రుతుల రుద్రాక్షభూతులు నతులు గొంట,
నతులపంచాక్షరీమంత్ర మతిశయిలుటఁ,
గాశి కైవల్యమార్గప్రకాశి కాదె !

తెలుపు నీరూపు, గళరేఖ మలినపఱతు
చలువ నీ సోఁకు, నొసఁట మంటలు రగుల్తు
చులకన కణమ్ము, పెంజడల్ తలకు నిడుదు
వెటుల నీనీట మునుఁగుదు నేను గంగ?

జంతుబీజము నీ జలస్పర్శ నొంది
పరిఢవిలు నేలొ శంకరాంకురము గాఁగ !
విత్తినదె మొల్చు ననుమాట యుత్తదయ్యె ;
ఏమి విడ్డూర మంబ గంగామృతాంబ !

భూమి సారమొ, యమరగంగామృత స్వ
భావసారమొ, కాశిలోఁ బడు శరీర
మర్ధనారీశమూర్తియై యవతరించు ;
నుభయమహిమలు నొక మొగ మొందెనేమొ!

నీ జలమ్ముల మునిఁగిన రాజుకూడ
నగును భిక్షువు, నగును దిగంబరుండు,
నింక మాదృశగతు లెన్న నెవరితరము?
సంగతోత్తుంగ జలతరంగాంగ గంగ !

ఈశ్వరుని రాజధానికే యేగుచుంటిఁ,
బుణ్యగంగానదీతోయముల మునింగి
కనుదు, విశ్వేశు నాదిదేవుని మహేశు,
సుకృతదుర్లభముక్తిని జూఱకొందు.

మదనమథనదేవసదనప్రవేశమ్ము
పాపమథనగాంగవారి మున్క
సుగృహమేధిభిక్ష, సుకృతార్థమణికర్ణి
కామృతిప్రశస్తి, కనఁగ వలదె !

చరణయుగమ ! చనుమ పురశాసన ప్రేమ
రాశి కాశి ముదిమిరాకమున్నె,
మున్నె మరణమొందు పుణ్యు లనంతర
మృతుల ప్రణవగురువు లిద్ద కాశి.

దోషరాశిఁ దొలగఁద్రోసికోఁ గాశికిఁ
జని కళేబరమ్ము జార్చు జీవి -
అహో! విచిత్ర మేమనందు? - దోషాకర
భూషణుఁడుగ మగుడఁ బొడము నట్టె !

అమృతరసభిక్షఁ గరదర్వి నన్నపూర్ణ
సులభముగఁ బెట్టు నెచ్చట, సుకృతు లెల్ల
హరవృషభఘంటికారావ మాలకింతు
రెచట నపనిద్ర, నచటున కేను పోదు.

వారాణాసీపురావాసి పంచజనులు
పట్టు వాణిజ్యవృత్తిఁ జెప్పంగఁ దరమె?
ఒక్కఁ డై పుట్టి, పంచత్వ మొంది, తుదకు
నష్ట విధములఁ బెరుగుదు రధికలబ్ధి.

వారణాసీజనాళి కీశ్వరుని చిన్నె
లనితరము లయ్యు, నల్ల ఫల్గునుఁడు తొల్లి
గాయపఱచిన భిల్ల శంకరుని సిరము
గంటు, తెలిపెడి నాదిశంకరుని వేఱ.

వనుల గాలిగొనెడి మునికన్న ముప్పొట
లారగించు స్వైరచారి కాశి
నతివిశిష్టుఁ డందు, రానందకానన
వాసమహిమ నిర్వివాద మహహ !

ఇలఁ బునర్భవభీతి వసించి కాశి
జీవి మరణించెనో యేమి చెప్ప నవుర !
ఘట్టకుటికాప్రభాతమ్ము కరణి నతఁడె
యటఁ బున'ర్భవ' రూపము నందితీఱు.

కచ్చుడ మ్మూని, కాశిలో గంగ దరిని,
సిరమునన్ దోయిలి న్నిల్పి, "శివ ! సదాశి
వా ! హరా ! గిరిజామనోహర !" యటంచు
కడపు టెన్నఁడొ దిన మొకక్షణముఁ గాగ !

ఈశ్వరుని రాజధాని వసింపరండు,
రండు విశ్వేశ్వరార్చనార్థమ్ము రండు,
యాజియవుగాక మాలయే యవును గాక
సరి వరించును సుమ్మ ముక్తి రమ కాశి.

వారణాసిని మృతిఁ గనువాని కవుర !
పాపగమి జందెముల్, దెసల్ వసనములును,
విసమె యశనము, వాసము ప్రేతవనము,
కదలిపో కోర్కి కలదేని కాశిపురికి !

కాశిలో నెల్ల కంఠగతాసులకును
పునుక, యేనికతోలు, పాములును, శశియు
సొమ్ములం దోఁచి, తెలివొంద సురిగిపోవు
మరణపూర్వమె యీశ్వరస్ఫురణ మమరు.

కాశిలోని కప్ప యాశీవిషమ్ముచే
గబళనమ్ము గనుచుఁ, గట్టివైచు
జడలఁత్రాళ్ల ముళ్లు సడల నీ కద్దాని ;
క్షేత్ర మహిమ మతివిచిత్ర మవుర !

హరుని వామాంగమునఁ బైట చెఱఁగు వీవ
నివతళించెడి మృగనాభిపవనవీచి
మాన్పుఁ గాశీజనాళికి మరణబాధ
ప్రణవమంత్రోపదేశవేళను సతమ్ము !

అర్ధకాయము మణికర్ణి కాంబువులను
నిలిపి, విశ్వేశ్వరుని నెలకొలిపి యాత్మఁ,
బ్రణవపంచాక్షరీమంత్రపరవశమున
ముదితహృదయాన నెపుడు పాయుదునో మేను?

సలిపి యాకంఠసలిలమజ్జనము, తలను
సైకతాభోగ మూని, 'యీశా !' యనంగ,
శివుఁ డొసఁగు తారకము చెవిఁ దవిలి యెప్పు
డసువు విడుతునొ గంగాభవాని యొడిని.

ఇత్థమణికర్ణి కాస్థలి నే శయించి,
శివుడు జపియించు ప్రణవము చెవులఁ జొరఁగ,
మోహ మెడలిన నిద్రలో మునిఁగి, యెపుడు
పోయుదునొ పాపహత మీప్రపంచదృష్టి?

స్వామి పరశివుండు శంకరాచార్యుల
సంస్కృతంపుఁ గాశిసార మిటులఁ
దెలుగుఁజేసికొంటిఁ దెలివిలోఁ దెలుఁగక
అమ్మ అన్నపూర్ణ కర్పితముగ.

కాశీయాత్రా మూలము
కాశీసారానువాదకార్యము కాఁగా
నాశించి పూవువాడ క
వీశుఁడు శేషుండు సలిపె; నిచ్ఛ ఫలించెన్.

-:- కాశీసారము సమాప్తము -:-

# కాశీ శతకము

**(క్రీ.శే. శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాస విరచిత కృతికి అనుసరణము)**

శ్రీమహేశ్వరు శ్రితజనశ్రీదు దలఁతు
సచ్చిదానందమూర్తిని సన్నుతింతు
సకలజగదంతరాధారు సంస్మరింతు
కాశికావిశ్వనాథు మోఁకటిలి కొలుతు. 1

అర్ధచంద్రానుకృత గంగ ననుసరించు
కాశికాసౌధపంక్తుల్ కలక్కజము గొలుప,
జనముఁ గైలాసమునకుఁ దోకొనఁ దలంచె
నన నుదఙ్ముఖి యవుచు జాహ్నవి స్రవించు. 2

అసికి వరుణకు నిడిమిని శిశిరకాల
నిర్మల స్నిగ్ధ గంభీర నీరపూర
జాహ్నవి వెలుంగు యోగిదృక్సార సరణి ;
సంగమధ్యమ గంగ నిశ్చలతరంగ. 3

“జాహ్నవీజలాన స్నాతులౌ వారికిఁ
దిరిగి పుట్టరాని తెరువు నిత్తు”
ననుచు నుదయమొందు నభిముఖమ్ముగ నినుం
డడుగఁబడని దాత యతఁడు కాశి. 4

ముడిచి కెంజడ విచ్చి నెమ్మోముదమ్మ
దిసమొలాఁ డీశుఁడనఁ దోఁచుఁ దీరభూమి. 5
మునిఁగి గంగను దటమంచమున జపించు
పుణ్యమూర్తికి మృత్యువు పులుసమమ్ము. 6

వివిధమతవేష భాషా విభిన్న దేశ
జనము లేకైక భక్తిని మునుకలిడుదు 7
రొక్కగంగనె ! సేవింతు రొక్క కాశి,
వినుతిసేయుదు రేకైక విశ్వనాథు. 58

గంగఁదేలు శవములం గని భీతిల్లి,
జనులు ‘బ్రదుకు క్షణిక’ మని తలంత్రు 8
గంగమునిఁగి యైతి గతకల్బిషుఁడ నంచుఁ
గేరు నెవఁడొ తృప్తిఁ దీరమందు. 9

జాహ్నవీశాపముక్తికై జననమొంది
జఘనభార యొకర్తు చల్చల్ల డిగ్గఁ
దీరసోపాన; మదిర ! సాధ్వీలలామ
స్నాతయై గంగనుఁ బునీత సలుపఁబోలు. 10

దండములు పట్టి కావివస్త్రములు చుట్టి
బాలశిష్యోపసేవల లీలఁ గొనుచుఁ
బావనీతీరమునఁ బరివ్రాజగణము
తేకువకొలంది విడుతురు దేహవాంఛ. 11

అసికి వరుణకు మధ్య జాహ్నవి రహింప
గాంగమణికర్ణి కాతీరగమ్యమాన
జనము కనవచ్చుఁ జీమలచా లనంగఁ ;
దీరమహిమ తైర్థికసంఖ్య తెలుపుఁగాదె ! 12

"మునిగి తేలుదు గంగ, నంబోలె నీవు
మునుక లిడుదేని భవవార్ధి ముక్తిఁ గొనఁగఁ
గడపుదును ని"న్నటంచు దాఁ బడవ పలుకు ;
నడుగఁబడు దాత సూవె యీపడవ గంగ ! 13

బిచ్చగాండ్రు, మంగళ్ళు, పూబేరకత్తె ,
లొడలిపూఁతల నిడువారు, తొడరి జనుల
వెంటఁబడి రేవు కాకులై వెలల రెందుఁ ;
దీర మిలుకాగఁ దిరుగు టవ్వారి తీరు. 14

అర్బుదజనాళి కాచమనైకరుచియ
యనుదినము గొల్పు మణికర్ణి కానుపమ సు
గంధిసలిలావగాహసంకల్ప మవుర !
తియ్యతీపుల మరగించుఁ దీరజలము. 15

మునిఁగి మణికర్ణికను సుంకమును నొసంగి
క్షౌరవిధి పుచ్చి దంపతిస్నాన మాడు
జనుఁడు జాహ్నవిఁ ; బురుషార్థచక్రనేమి,
కర్మమయభూమి, భారతఖండ మవని. 16

హరిపదమునందు జనియించి యసిత యగుచు,
నిందు శేఖరు జటఁ జొచ్చి యువము గొనుచు,
జహ్ను చెవిఁ బడి సాధుతాసంగ యగుచుఁ,
గ్రమత డిగె గంగ యిల భగీరథుని కృషిని. 17

అరయ నాశమొంద దయిదు క్రోసుల కాశి
పత్తన మ్మిదేమి ప్రలయములను ! 18
ముక్తి నాల్గువర్ణముల కిచ్చు నిక్కాశిఁ
బొగడు కృతులె కృతులు ! పొగడఁ గవులు ! 19

విస్తరించుసుమ్ము యాస్తిక్య, మద్దాన
జనులఁ బాలనమ్ము సలుపుఁ గాశి,
ఈశు మహిమమెల్ల నీతీర్థమునఁ దోచు
ధర్మపోషణార్థ మర్మమగుచు. 20

క్షేత్రముల నుత్తమమ్ము కాశీపురమ్ము,
శ్రీనివాసమ్ము వారణాసీపురమ్ము,
ఇల ముముక్షు గృహమ్ము విశ్వేశు పురము,
కాశి ప్రత్యక్షదృశ్య కైలాసపురము. 21

శిలయొ దేవతయో, పాలితుఁడొ ప్రభుండొ,
తెలియ దిక్కాశి నాప్తోపదేష్ట లేక 22
అవయవీకృత నవభక్తు లవహితైక
మతుల కవగతములు కాశిఁ గుతుక మున్న. 23

వారణాసిని వెలయు దేవతల నెల్ల
విశ్వనాధు వైశిష్ట్యము విస్తరమ్ము,
పూజనీయము ముల్లోకములకు స్వామి
మందిరసువర్ణగోపుర మెందుఁ గనిన. 24

జానుదఘ్నాభిషిక్తాంబువైన గుడిని
బిల్వదళరాశియె విసృష్టవృషభభుక్తి. 40
బిల్వదళపుంజ మాను నావృషభ మవునొ
నంది? అర్చక తేజ మెన్నంగవలదె? 25

అనిశ మున్నతసాంద్రసౌధావళులను
వాయు వుష్ణము పైనఁ, జల్వయును లోన, 26
రేవు లర్వదినాల్గుఁ పేర్వేఱఁ జుట్ట
నడుమ రాతివి మేడ లందమగు కాశి. 27

తమ్మి మొగ్గరమునఁ జొచ్చి తలఁగినటుల
సందుగొందులఁబడు క్రొత్త జనుఁడు భ్రమసి
తిరిగి తిరిగి వసతి కెట్టొ తేటి చేరు ;
శ్రమపడిన గమ్యమార్గదిగ్భ్రమలు తొలఁగు. 28

దేశభాషరాని తీర్థయాత్రికునకు
నిష్టవస్తు వమర దెందుఁ గాశి,
నెంత ధనికుఁడైన నంత దరిద్రుండె
దేశభాషరాక కాశికేగ. 29

వేషభాషల గానవిశేషములను
భోజ్యవస్తువులం దీపిం బుణుకుఁ గాశి 30
వారియంత్రప్రయోజిత వారణాసి
నూఁగు నాళములందు గంగోదకములు. 31

ఈశ్వరుఁడు లింగరూపుఁ డింటింటఁ గాశి.
దైవభక్తిసర్వస్వ మద్దానఁ గూటె. 32
భరతవర్షోత్తమోత్తమచిరపురమ్ము
ధనికనిర్ధనికానందదమ్ము కాశి. 62

కాశిఁ బొడమిన ప్రజ కలంకారమేల?
కాంత కొక మేలిముసుఁగె బంగారుతొడుగు,
పురుషునకుఁ బాగ పెట్టనిభూషణమ్ము,
నాగరకతకుఁ గాశి జన్మస్థలమ్ము. 33

అది మహాశ్మశాన మానందకాననం
బదియ వారణాసి ! అందె మొరయు
"రామనామ మొకఁడె నేమమౌ శంబాణి,
సత్య, మదియ నిత్య సత్య"మనుచు. 34

వెడదతోటలు నడబావు లడరుఁ గాశి
వివిధ శిల్పాకృతగృహాళి వెలుఁగుఁ గాశి,
అరయ ఘంటాపథాలు విద్యాలయాలు,
కాశి సర్వాంగసౌందర్యఖనిగఁ దోచు. 35

అవుర! గంగ మునిఁగి శివరాత్ర్యుషస్సున
భవుని జలకమార్చి బసకుఁ జేర 36
నధికకష్ట మయ్యెఁ; నన్న పూర్ణాలయ
బాలబృందగీతి పారమొయిదె. 37

కాశిలో జారచోరులే నీశభక్తి
వశులు, శివరాత్రి నుత్తమత్వమును గొనరె? 38
మ్రోయు శివనామమే కాశి రేయిఁ బవలు ;
కుజనుఁ డిఁక గాఁడె శివరాత్రి సుజనుఁడుగను? 39

నరులు క్రీమేడ నుండ వానరము లుఱికి
సందడించి ఫలాదుల సంగ్రహించు. 41
నృత్తగీతవాద్యపురాణ నియత జనులు
యోగవశులయి శివరాత్రి జాగరింత్రు. 42

నిత్యయాత్రికు లిట నడనేమ మూని
స్నానపావితు లయి విశ్వనాథముఖ్య
దేవదశకము సేవించి పోవుచుండ్రు ;
నిత్యయాత్రికనిష్ఠ కొండికయె కాశి? 43

మేడకడ నరుంధతిఁ బోలి మినుకు మనును
మేడ నడిమిని గననగు మెఱ పనంగ
మేడ యడుగునఁ బాంచాలిజాడఁ దోఁచు
కాశిని గులాంగన వెలుంగుఁ గనఁగఁ గనఁగ. 44

సత్రము లనేకములు ప్రభుస్థాపితములు
ద్రావిడబ్రాహ్మణాహ్నాన్న తర్పణములు. 45
కావి విలువ యమూల్యము, గంగరేగు
ఫలము మధురము, బిక్షుకకులము లక్ష. 46

నెలకొలిపి దేవు నాశ్రయించినను దొరకు
ధనము పూజారి కిట; స్వయంతరణమునకుఁ
బరతరణమున కగు నుపకరణ మదియ !
స్వార్థ తీర్థ ప్రకాశి యి వ్వారణాసి. 47

జంగమస్థిరాకృతాంగులు దేవతల్
తీర్థవాస సంశ్రి తార్థదాత. 48
లోర్చి మార్గకష్ట, మోడ్చి ప్రాణధనమ్ము
నెటు విదేశభక్తుఁ డెయిదు సుకము? 49

గంగ కవల 'వ్యాసకాశి' కాశీసుత;
ప్రభువు వ్యాసుఁ డింద్రవైభవుండు. 50
వారకాంత యొకతె యారాజసభ నృత్య
గానమహిమ నూఁపె మానసముల. 66

ముదమును వెఱపును దొందర
కదురగఁ దమయాత్ర సార్థకమ్మొనరింపన్
నది దాటి వ్యాసముని గని
కదలుదు రక్కాశిఁ దైర్థికప్రజ తుష్టిన్. 51

నిత్యమును విశ్వనాధసన్నిహిత కాశి
నిత్యగంగానదీనృత్యనిలయ కాశి
నిత్య ముత్సవయుత కాశి, నిత్య సత్య
సచ్చిదానందదాయిని స్వప్రకాశి. 52

ఫాల్గునమున శుక్ల పక్షోత్సవము హోలిఁ
గృష్ణ కీర్తనోజ్జ్వలైకమతులు 53
పాడి నవ్వి పదరి పర్వసమ్ముదితులై
కుంకుమమ్ముఁ జల్లుకొంద్రు కాశి. 56

మ్లేచ్ఛహత కాశి ప్రస్తుతాంగ్లేయ విభు కృ
పామృతాత్త చేతనత సౌఖ్యమును బొందు. 57
ఇద్ధ కాశీజనోన్నత హృదయసీమ
బిందుమాధవు కంబముల్ బెరసి తెలుపు. 59

ఆఱు శాస్త్రములకు నవధులు, నఖిల లో
కార్థనిధులు వారణాసి బుధులు,
జన్మభూమి కాశి సంస్కృతవాణికి,
సందియంబు వలవ దిందు నెందు. 60

స్వామి కృష్ణదేవు సాందీపశుశ్రూష
యిందె యొదవ, విద్దెకేమి కొదవ ! 63
శిష్టసంప్రదాయసిద్ధచాతుర్వర్ణ్య
వర్తు లుండ్రు కాశిఁ, బరుల గనము. 61

చూపువల పన్ని విటులను చేపగమిని
దమికొనం జేయ సాయంతనముల మాటి
యాటవెలఁదులు సౌధవాతాయనములఁ
గూరుచుందు రయారె యవ్వారణాసి ! 64

కాశి నివసించు నరుఁ డుపకారపరుఁడు,
అన్నమిడి విద్దె లొసఁగు విద్యార్థితతికి, 65
శుక్రవారపు మాపు 'ఘణ్' శ్రుతులు మొరయుఁ
గప్పురపు టారతులు కాలగళుఁడు కొనఁగ. 67

తివుర దొరకు సమస్తవస్తువులు కాశిఁ
దక్షణమ లక్షభూసురతర్పణములు. 68
దేని నెందెందుఁగోర నందించు నద్ది
కాశి; యందెల్ల వీధులు కల్పలతలు. 72

కాలసూత్ర మొండు కరమున బిగియించి
నెమిలిపించియమున నిమిరి సిరము
యాత్రికులకు భైరవాలయనియతుఁడు
స్వస్తివాచకమ్ముఁ బలుకుఁ గాశి. 69

బొజ్జతాల్పును, నేనిక మొగము వేల్పు,
గండు డుంఢి, ముక్కంటి, మున్ గవను గాచి
పితరు దరిసెనమున కనుమతి నొసంగు
యాత్రికుల, కాతఁ డాదిపూజార్హుఁడెందు. 70

ఇనుఁడు కనరాని లోగిళ్ల జనము వెలుఁగుఁ
బుట్ట లుకలుక మను తెలిపురువులనఁగ. 71
వెదురుకుదురులు చింతలు వెలివిబూది
తక్క నడవులు కొండ లాదరిని లేవు. 80

"ఇ మ్మెదేని ద్రవ్య, మీని దుండ" దటంచు
దేవ తెవరొ గాజుప్రోవు లొందు. 73
"ఇల ననంతుఁ బోలి యేఁగాశి భరియింతు"
ననెడి దేవి నామ 'మంబకాశి'. 76

"దండపాణి భయమ్ము నాదండఁ బ్రజకు
వలవ"దని శంకరుఁడు దండపాణి యయ్యె. 74
"నన్ను భక్తిని గన్న నజ్ఞానతమము
నరుఁడు దాటు" నటంచు నీశ్వరుఁడు చాటు. 75

సకలతీర్థతరంగసంసంగ గంగ,
సర్వ భూతమయుండు విశ్వపతి శివుఁడు,
అఖిల దేవ మహత్త్వవిన్యాస కాశి,
సర్వతో ముఖి ముక్తి నిస్సంశయమ్ము. 77

కాశి శ్రద్ధయు, బౌద్ధుల కరుణ, యవని
ముసుఁగు, నాంగ్లేయ లౌక్యమ్ముఁ బొందెఁ గాశి. 78
"తిరుగు సంసారచక్రము త్రిగుణములనె"
యనుచుఁ ద్రిగుణాత్మవృషభవాహనము తెలుపు. 83

తూర్పు పడమరలందు వీధులు ముడుంగ,
దక్షిణోత్తరముల నాయతములు కాశి;
భువిని సౌధము లత్యల్పములుగఁ దోఁచి
దివిని గననగు విపులము లవుచు వెలిఁగి. 79

హిమవదచలవింధ్యామధ్యసమతలాన
జలధి కెడ వెల్గు గోధూమఫలక కాశి. 81
ద్రావిడబ్రాహ్మణాళి సదక్షిణాన్న
దాత లాహ్నికమాత్రసత్రములఁ గాశి. 82

"రుద్రు నభిషేకమునకు నిర్నిద్ర గంగ
కలుగ మజ్జల మెవరికి వలయు" ననుచు
నారికేళము మొలవదొ వారణాసి !
కంటఁ బడదేల కొబ్బరికాయ కాశి? 84

ఇచ్చ మేసి బలిసి యిదె బలీవర్దము
బక్కదాని గెలిచి నొక్కు ఱంకె. 85
కోతి వలువ గొనుచుఁ, గొని యన్న మిడు వల్వ;
ఎట్టొ యన్న మంత కొట్టవలదె ! 86

పారవతముఁ బిలువఁ జేరు నెందుండియేన్
పొరుగుమేడ నాడు బొట్టెవోలె. 87
సూత్రబద్ధపక్షి సుడిసి తన్నెడి డేగ,
ఓర్చు నెవఁడు పరమహోన్నతులను? 90

పెద్ద గద్దెల, రుదురాకపేరు లూఁగ
నరుగొ పౌరాణికులు ! శ్రోత లిరుగొ చుట్టు ! 88
వివిధమత పండితమ్మన్యు లవుర యుదయ
సాయముల వ్యర్థవాదముల్ సలుపుకొంద్రు. 89

ఒడలుచెడినఁ గాశి విడఁడు ముముక్షువు
పతిని దుష్టు విడునె సతి యెట్లైన? 91
నీలకాచవలయనివహ శైశిరగంగ
శిశుకనీన కనఁగఁ జిలుకుఁ జలువ. 93

యమున మున్నగు నదులు గంగాంబు రాశిఁ
గలిసియును బాఱుఁ గొనదన్క గంగపేర,
పెండ్లి మొదలుగఁ బుట్టింటిపేరు విడిచి
భర్తృగోత్రముఁ బడతులు పడయునటుల 92

బుద్ధ మాంగల్యమహ మ దద్భుతము ! జనము
కడపుదురు రేఁబవళ్ళట గంగమధ్య. 94
నడిమిగం గొకదీవిగాఁ బడవ లునిచి
జనము తౌర్యత్రికానందమున మునుంగు. 95

పిఱుఁదులఁ గరమ్ముఁనిచి యొక్క వేశ్య తిరుగు
సంసదాలయమానసహంసి యగుచు. 96
ఉదయమున భైరవి లపించి యొక్క వేశ్య
యఖిలజనమోహనాస్త్రనృత్యమ్ముఁ సలిపె. 97

జాహ్నవీ విశ్వనాథ సంస్తవ మొనర్ప
నోళ్ళు చాలవు గద యనంతునకునైన !
ఉభయసంస్తుతు లొనరింతు నభయవృత్తి
నర్కమండల మరచేత నదిమినట్లు. 98

నన్ను బోలిన పతితుని నిన్ను బోలు
పతితపావని గన; మదేగతి ఘటిల్లె
నసమయుగ సమావేశ ? మే మనఁగ వచ్చు !
నా యదృష్టముపండె గంగాభవాని! 99

కవితాసంగీతకళా
ర్ణవుఁ డగు హరికథనగురువు నారాయణదా
సవిముక్తశతకరాజం,
బవబోధక, మమరవాణి నార్యులకొసఁగెన్, 100

కాశీయాత్రానంతర
కాశీశతకానుసారకవితారస మా
వేశించిన పువ్వాడక
వీశుఁడు శేషుండు పలికె నిదె యాంధ్రమునన్.

**ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః**

# సమర్పణము

కాశిసార మద్ది కాశీశతక మిద్ది
అమ్మ అన్నపూర్ణ కర్పితములు
అమ్మ యెన్నడో 'శివోహమ్ శివోహ' మ్మ
టంచు నిన్నె చేరె; నరయు మభవ!





# కవి పాదుషా

## పద్య కృతులు

కవిత

గోవత్సము

తాజమహాలు

దారా

శతపత్రము

పాలవెల్లి

అపశ్రుతులు

ఆంధ్రసామ్రాజ్యము

## గద్య కృతులు

మధుకలశము

పరశురాముడు

ఉత్తములు

## నవలలు

ఏరువాక

ఆంధ్రతేజము

ఔరా !

ఎవరు ?

## నాటకములు

ఢిల్లీ దర్బారు

దుర్గాదాసు

పృథ్వీపుత్రి

ప్రతాపరుద్రమదేవి

సహపంక్తి

ప్రాణరక్షణ

పరిష్కారము

శిల్పకావ్యము

తొట్రుపాటు

నందనార్

స్వయంవరము

బిల్హణీయము

చదరంగము